తదేహతాదాత్మ్యంపోతుంది, దానిపేరుమోక్షం, చైత న్యానకుబద్ధత్వంలేదు, ముక్తత్వంలేదు, బంధం మోక్షం కల్పనామాత్రం, జీవస్వరూపంలోయేమీలేదు, అతనిస్వ రూపంస్వప్రకాశం, చిద్రూపం, కేవలచైతన్యం, బ్రంహ్మ వున్నది, అక్కడయేకల్పనాలేదు, యితని అవిద్యాత్యా గంచేస్తే, అచైతన్యానకుజీవత్వంలేదు, స్థూలసూక్ష్మదేహ ద్వయమూలమంతఃకరణ, దానిపేరుహృదయం,దానిలో పలతనస్వరూపం స్వప్రకాశం, చిద్రూపం ఆనందరూపం, సచ్చిదానందబ్రహ్మం, పరిపూర్ణం చైతన్యఘునం, చిదా కాశం, చిన్మాత్రం, అవినాశం, నిర్వికాసంఅసంగం, తన స్వరూపంవున్నది, యిట్లాయెరిగిదేహాభిమానంవిడిచిపెట్ట వలెను. వర్ణాభిమాన-ఆశ్రమాభిమాన- కర్మాభిమాన- జాత్యాభిమానములనే-అనేక అభిమానములను విడిచి, త నస్వరూపముతో తానువుండవలెను. దీనిపేరుబ్రహ్మైక్య జ్ఞానం, యీజ్ఞానంపేరు బ్రహ్మసాక్షాత్కారం, యిట్లాయె రింగివూరికెవుండవలెను, అగ్న్యాకాశవాయువులుగూడి జీవుడు, జాగ్ర, త్స్వప్న, సుషుప్తి, తురీయ్యా, తుర్యాతీ తాలు జీవుని గుణాలు.

౪ జ్ఞానేంద్రియ పంచకములో-త్వగింద్రియం.

త్వగింద్రియం ॥ మనస్సునుంచి స్పర్శ గానవలెననే వృత్తిపుట్టింది, దానిపేరు త్వగింద్రియం, దీనికధిపతి వా యువు, స్పర్శవిషయం, ఇంద్రుడధిదేవత, యిదివాయు మిశ్రితాగ్న్యర్థచతుర్థాంశ.

౫. చక్షురింద్రియం.

చక్షురింద్రియం ॥ బుద్ధినుంచి రూపంచూడవలె ననే వృత్తిపుట్టింది. దానిపేరుచక్షురింద్రియం, దీనికధిపతిసూర్యుడు, ఇది అగ్న్యర్థం. దీనికి అగ్ని మహాభూతం, రూపంవిషయం.

౬. శ్రోత్రేంద్రియం.

శ్రోత్రేంద్రియం ॥ అంతఃకరణనుంచి శబ్దం వినవలె ననేవృత్తిపుట్టింది । దానిపేరేశ్రోత్రేంద్రియం । దీనికధిపతిదిక్కులు । యిది ఆకాశమిశ్రిత అగ్న్యర్థ చతుర్థాంశ । దీనికి ఆకాశభూతం । శబ్దంవిషయం॥

౭. జింహ్వేంద్రియం.

జింహ్వేంద్రియం। చిత్తంనుంచిరసంపుచ్చుకోనవలె ననే-వృత్తిపుట్టింది । దానిపేరే జింహ్వేంద్రియం । దీనికధిపతి వరుణుడు । ఉదకమహాభూతం।రసంవిషయం।యిది ఉదకమిశ్రితాగ్న్యర్థచతుర్థాంశ॥

౮. ఘ్రాణేంద్రియం.

ఘ్రాణేంద్రియం । అహంకారంనుంచి గంధం పుచ్చుకోనవలెననేవృత్తిపుట్టింది । దానిపేరే ఘ్రాణేంద్రియం । దీనికధిపులు-అశ్వినీదేవతలు । పృథ్వీమహాభూతం । గంధంవిషయం । యిదిపృథ్వీమిశ్రితాగ్న్యర్థచతుర్థాంశ॥

౯. విషయపంచకం.

శబ్దవిషయం ॥ అంతఃకరణనుంచి శబ్దంపుట్టింది। యిది సుశబ్దాపశబ్దములు-ఇది ఆకాశాన్వితోదకార్ధచతుర్థాంశ,

# సద్గురుసంకీర్తనలు.

యిదిపామును-లేడినిబంధనంచేసును॥

## ౧౦. స్పర్శవిషయం.

స్పర్శవిషయం ॥ మనస్సునుంచి స్పర్శంపుట్టింది। యిదిశీతోష్ణములు। యిదివాయురన్యోన్యోదకార్ధచతుర్థాంశ। యిదియేనుగునుబంధనచేసును॥

## ౧౧. రూపవిషయం.

రూపవిషయం॥బుద్ధినుంచిరూపంపుట్టింది। యిదిరక్త-శ్వేత-కృష్ణ-ధూమ్ర-హరిత-పీతములు। యిది అగ్న్యన్యోన్యోదకార్ధచతుర్థాంశ। మిడుతనుజంపును॥

## ౧౨. రసవిషయం.

రసవిషయం ॥ చిత్తమునుంచి రసంపుట్టింది। యిది లవణామ్లతిక్తమధురకటుకషాయాలు। యిదివుదకార్ధం। చాపనుచంపును॥

## ౧౩. గంధవిషయం.

గంధవిషయం॥ అహంకారంనుంచిగంధంపుట్టింది। యిదిసుగంధ దుర్గంధములు । యిదిపృధివ్యన్యోన్యోదకార్ధచతుర్థాంశ। తుమ్మెదనుచంపును॥

## ౧౪. కర్మేంద్రియపంచకం.

వాగింద్రియం ॥ అంతఃకరుణనుంచి శబ్దంపలుకవలెననేవృత్తిపుట్టినది । దానిపేరేవాగింద్రియం । దీనికధిపతి అగ్ని । సరస్వతిఅధిదేవత । సువాక్కు- దుర్వాక్కు- విషయం । నాగవాయువు ॥

౧౫. పాణీంద్రియం.

పాణింద్రియం ॥ మనస్సునుంచి సేవ చెయ్యావలెననే వృత్తిపుట్టింది। దానిపేరే పాణీంద్రియం-దీనికధిపతి ఇంద్రుడు । దానప్రతిగ్రహాలువిషయం । కూర్మ్మవాయువు॥

౧౬. పాదేంద్రియం.

బుద్ధినుంచిరాకడపోకడచెయ్యావలెననే వృత్తిపుట్టింది। దానిపేరే పాదేంద్రియం । దీనికధిపతి-ఉపేంద్రుడు । గమనాగమనములువిషయం । కృకరవాయువు ॥

౧౭. గుహ్యేంద్రియం.

గుహ్యేంద్రియం॥ చిత్తంనుంచిమూత్రం చెయ్యావలెననేవృత్తిపుట్టింది। దానిపేరేగుహ్యేంద్రియం । దీనికధిపతిప్రజాపతి । ఆనందంవిషయం । ధనంజయవాయువు ॥

౧౮. పాయురింద్రియం.

పాయురింద్రియం । అహంకారంనుంచి మలవిసర్జనంచెయ్యావలెనని వృత్తిపుట్టింది। దానిపేరే । పాయురింద్రియం। దీనికధిపతిమృత్యువు। మలవిసర్జనంవిషయం । దేవదత్తవాయువు॥

౧౯. భూతసృష్టి.

ఆద్యాన్మహాకాశః । మహాకాశాన్మహావాయుః । మహావాయోర్మహాతేజః । మహాతేజాన్మహాసలిలం। మహాసలిలాన్మహాపృథ్వీ ॥ ఆత్మనఆకాశఃసంభూతః । ఆకాశాద్వాయుః । వాయోరగ్నిః । అగ్నేరాపః। అద్భ్యాంపృథ్వీ॥

### ౨౦. భూతపంచకం.

ఆకాశం ॥ శబ్దంనుంచి ఆకాశంపుట్టింది । దీనికి ప్రతిధ్వనియిచ్చేదిగుణం । బయలైయ్యుండుటధర్మం । తిరగనిచ్చుటకూర్చోనిచ్చుటకర్మం । దీనికికృష్ణవర్ణం । తదధిదేవతసూర్యుడు ॥ అవకాశం । అచ్ఛిద్రం। అస్పృశ్యత్వం। నీలవర్ణత్వం । శబ్దం ॥ తమోగుణాన్నుంచిపుట్టింది।త్రిగుణాత్మకం ॥

### ౨౧. వాయువు.

స్పర్శనుంచివాయువుపుట్టింది । భిసిభిసిఅనేశబ్దగుణమున్ను । శీతోష్ణములనేస్పర్శమున్ను । చలించుటమనేధర్మమున్ను । పొదిజేసుటమనేకర్మమున్ను । హరితవర్ణమున్ను కలది । దీనికియింద్రుడధిపతి ।సంచారం। చలనం । స్పర్శనం। శోషణం । ధూమ్రవర్ణంకలది।ఆకాశంనుంచిపుట్టింది। త్రిగుణాత్మకం॥

### ౨౨. తేజస్సు.

రూపంనుంచి తేజస్సుపుట్టింది । భుగభుగమనేశబ్దగుణమున్ను । ఉష్ణస్పర్శాంన్ను । ప్రభారూపమున్ను। పాకంచేసుటమనేకర్మమున్ను । ఉష్ణించుటమనేధర్మమున్ను । కలది । దీనికిరుద్రుడధిపతి ॥ దాహకత్వంపాచకత్వం । ఉష్ణత్వప్రకాశత్వరక్తవర్ణత్వములుగలది । వాయువునుంచిపుట్టినది । త్రిగుణాత్మకం ॥

### ౨౩. ఉదకం.

రసంనుంచివుదకంపుట్టినది। దీనికిభుళభుళశబ్దగుణమున్ను । శీతస్పర్శాన్ను । శుక్లరూపమున్ను । మాధుర్యారస

మున్ను । తదుపుటమనేధర్మమున్ను । ముద్దజేసుటమనేక ర్మమున్ను । శ్వేతవర్ణమున్నుకలది । దీనికి అధిపతివిష్ణు । ప్రవాహంఆప్యాయనం । ద్రవం । రసం । శ్వేతవర్ణంకల ది । అగ్నినుంచిపుట్టినది । త్రిగుణాత్మకం॥

౨౪. భూమి.

గంధంనుంచిభూమిపుట్టినది - దీనికికటకటధ్వనిన్ని । కఠినస్పర్శ । నీలాదికచిత్రరూపం । మధురామ్లాదిరసం । సువాసనదుర్వాసనలు । కఠినత్వధర్మమున్ను॥ ధరించుట మనేకర్మమున్ను।పీతవర్ణమున్ను।బ్రంహ్మాదిదేవత॥ యిన్ని కలది। స్థూలతా ॥ నానాకారత । కాఠిన్యం । గంధంపీత వర్ణంకలది ॥

౨౫. గుణత్రయం.

సత్వగుణం । బుద్ధినుంచి పుట్టినది । దీని పేరే బ్రాహ్మజ్ఞానం - దీనినుంచిదేవలోకప్రాప్తి । అదే అన్య దాజ్ఞానబుద్ధి । దీనదేవయోనిప్రాప్తి । దీనిధర్మంస్వప్నా వస్థ । నిత్య నైమిత్తిక కర్మం ॥ వైరాగ్యం ॥ శాంతి ॥ ఔదార్యంకలది । సౌమ్యం । జ్ఞానం । స్నానం । హోమం । క్షమా । సత్సహవాసం । నిశ్చయం । శ్రద్ధా । ధైర్యం । వివేకం । యీపదీ । దీని గుణాలు ॥ దయా । ధర్మం । కృపా । భక్తియిప్వ దీనిగుణాలే ॥యెసక॥

౨౬. రజోగుణం.

రజోగుణం । మనస్సునుంచి రజోగుణంపుట్టింది । దీ నిపేరే విషయాసక్తి । దీన మనుష్యలోకప్రాప్తి । అన్య

ధాజ్ఞానజన్యం । దీనమనుష్య యోనిప్రాప్తి । దీనిధర్మం జాగ్రదవస్థ । కామ్యకర్మం । కామక్రోధ లోభాదులుగలది । దర్పం । మందం । అహంకారం । విషమవాదం । అప్రియవాక్యం । ఉద్యోగం । మత్సరం । కోపం । యీ యెనిమిదిరాజగుణాలు ॥ దానం । భోగం । శృంగారం । వస్త్రగ్రహణం । స్వార్థం । యివియన్నియుకలది ॥ యెరుకమరుపులుకలశినది ॥

౨౭. తమోగుణం.

అహంకారమునుంచిపుట్టినదితమోగుణం। ఆలస్యం । మోహం। నిద్రా-చాపల్యం । హీనవృత్తి । పరనిందా। హింసా । సాంప్రష్టత్వం । వివాదం । శోకం । కలహం । వధా।వంచన । యివితమోగుణగుణాలు । యీ తమోగుణంపేరే మోహభ్రాంతి । దీనఅధోలోకప్రాప్తి । యిది అన్యధాజ్ఞానజన్యం । దీనపశ్వాదియోనిప్రాప్తి । దీనిధర్మం । సుషుప్త్యవస్థ । తామసకర్మం । ఆలస్యం।భ్రాంతి । తొందర । మొదలైనవికారములుగలది ॥మరుపు॥

౨౮. ఈశ్వరదేహచతుష్టయం.

మహాకారణం ॥ ఈశ్వరుని మహాకారణశరీరం మాయ । మూలప్రకృతి । స్వరాట్టు - అనాహతం । పంచబ్రహ్మమయంబు । పంచభూతములకు హేతుభూతం । దీనికి సర్వసాక్షిణ్యావస్థ। ఈశ్వరుడభిమాని । శుద్ధసాత్వికాహంకారం । జ్ఞానశక్తి । బ్రంహ్మాండాతీతస్థానం । సర్వకర్తృత్వ - సర్వపాలకత్వ । సర్వసంహారకత్వ - సర్వ ని

యామకత్వ - సర్వభోక్తృత్వ । సర్వేశ్వరత్వాది-షడ్గుణైశ్వర్యభోగం । ఓంకారమాత్మక । మహాత్మ । నిరంజనస్థానం । అర్ధమాత్రక । యిదే అంతటికిమూలం । యిదే త్రిగుణాలపుట్టినిల్లు-సునీలగత-స్ఫటికవర్ణం । విద్యా విద్యాచ స్వయమేవభవతి-అనివున్నది ॥

౨౯. ఈశ్వరుని కారణశరీరం.

ఈశ్వరుని కారణశరీరం ॥ అవ్యాకృతమాయ । యిదేస్థానం । మహాత్తత్వం । మకారమాత్ర - విస్మరణ ॥ ప్రళయావస్థ । రుద్రుడభిమాని । తామసాహంకారం । యీ అహంకారంవలన తాపత్రయాదులుపుట్టినవి । క్రియాద్రవ్యశక్తి । అగ్నిస్థానం । సర్వసంహారభోగం । సుషుప్తి । దీనమహదహంకారాదులుబుట్టును । యిదిత్రిగుణగర్భం । బిందూపాధి - పంచభూతాలకుకారణం । దీనికిపార్వతిశక్తి । కైలాసస్థానం । కృష్ణవర్ణగతశ్యామవర్ణం । యిదిప్రణవతృతీయపాదం ॥ అజ్ఞానం కేనభవతీతిచేత్-నకేనాపిభవతి॥

౩౦. ఈశ్వరుని సూక్ష్మశరీరం.

ఈశ్వరునిసూక్ష్మశరీరం-హిరణ్యగర్భం । ఉకారమాత్ర । స్థిత్యవస్థ । విష్ణుఅభిమాని । సాత్వికాహంకారం । యీఅహంకారంవలన - సూర్యాదిదేవతలుపుట్టిరి । దీనికిదశదిక్కులు-శ్రోత్రంబులు । వాయువు త్వగింద్రియంబు । సూర్యుండు-నేత్రంబులు । వరుణుండు-జిహ్వేంద్రియంబు।అశ్వినీదేవతలు-ఘ్రాణేంద్రియంబు। వంహ్నీ-వా

గింద్రియంబు।యింద్రుండు-కరంబులు । ఉపేంద్రుండు-పాదంబులు । బ్రహ్మ-గుహ్యంబు ॥ మృత్యువు-గుదంబు । జ్ఞాతృవంతఃకరణ । మనంబు-చంద్రుండు । బుద్ధి-బ్రహ్మ। క్షేత్రజ్ఞుండు-చిత్తం । అహంకారంబు-రుద్రుండు । దీనికి చంద్రస్థానం । సర్వపాలకభోగం । లక్ష్మీశక్తి । వైకుంఠ స్థానం । శ్వేతవర్ణగతకర్బురవర్ణం । నీలమేఘమందుండే । మెరుపువన్నె । యితనికిసప్తవాయువులుప్రాణాలు। యిదిప్రణవద్వితీయపాదం ॥

౩౧-: ఈశ్వరుని స్థూలశరీరం.

ఈశ్వరునిస్థూలశరీరంవిరాట్టు। యిందుకు-అకారమాత్ర । సృష్ట్యవస్థ - బ్రంహ్మాభిమాని । రాజసాహంకారం। పృథివ్యాపస్తేజో వాయురాకాశ చంద్రి సూర్యాత్మలనే అష్టమూర్తులీశ్వరునియొక్క విరాడ్రూపంబగు స్థూల దేహంబు। దీనికిక్రియాశక్తి। సూర్యస్థానం । సర్వకర్తృత్వభోగం । యిందుకు-ఆత్మ । భూతాత్మ । యితనికిధరణిపాదములు । దివితలంమస్తకం । అంతరిక్షంనాభి। యిట్టివిశ్వశరీరునకు । అతలంబుపాదంబులు । వితలంబుగుల్ఫలు । సుతలంబుజంఘలు । రసాతలంబు జానువులు । మహాతలంబూరువులు । తలాతలంబుకటిప్రదేశం । నాగలోకం నాభ్యధోభాగం । భూలోకంనాభి । భువలోకంజఠరం।మహాలోకంకంఠం । జనలోకంముఖం। తపోలోకం భ్రూమధ్యం । సత్యలోకంసహస్రారం। దీనికిసావిత్రీశక్తి । సత్యలోకస్థానం । రక్తవర్ణ గతపీతవర్ణం ।

జీవునినాలుగోశరీరం । యితనికిస్థూలశరీరం । యిదిప్రణవప్రథమపాదం । సముద్రాలుకుక్షి।నదీనదములునాడులు। పర్వతంబులు శల్యంబులు । వృక్షలతలురోమంబులు॥

౩౨-. జీవదేహచతుష్టయం.

జీవునిమహాకారణశరీరం । యిదేమూలమాయ । యిదేఅంతఃకరణ।అర్థమాత్ర।స్ఫురణరూపం । ధ్వనిరూపం । జ్ఞానం। స్మరణ। యిదునై అయిదోతత్వం।తుర్యావస్థ।ప్రత్యగాత్మాభిమాని । శుద్ధసాత్వికగుణం । అక్షరస్వరూపం । కూటస్థం । పంచభూతోత్పత్తికి హేతువైన - సద్యోజాత-వామదేవ । అఘోర-తత్పురుష-ఈశానులనుపంచబ్రహ్మలుగలది । ఆదిశక్తిపరాశక్తి- జ్ఞానశక్తి-ఇచ్ఛాశక్తి। క్రియాశక్తులుగలది । ప్రేరేపకంబులైన । పంచప్రాణంబులు । పంచాక్షరియనే-పంచేంద్రియంబులుగలది। బ్రంహ్మ-విష్ణు-రుద్ర-ఈశ్వర-సదాశివులను ।పంచకర్తలంతఃకరణంబులుగలది। దీనికిమూర్ధ్నిస్థానం । ఆనందలవభాసభోగం । ఓంకారమాత్రుక । నిష్కలాత్మ । యిదిబ్రంహ్మానుసంధానంచేసేది । మసుర్గామాత్రప్రమాణం । మేఘకాంతి । అతసీపుష్పసంకాశం । సునీలవర్ణం । ధూమ్రవర్ణం । యిదిప్రణవచతుర్థపాదం । అంతఃకరణ। అంతఃకరణ-ప్రతిబింబచైతన్యం । తదధిష్ఠానచైతన్యంగలశి-జీవుడననైనది॥ బ్రంహ్మానుసంధానమనంగాయేమంటే॥ పరమజడమయిన స్థూలదేహమునునేగాను । జ్ఞానకర్మలక్షణంబులుగల యింద్రియంబులునేగాను । గమనాగమ

నములుగల ప్రాణములునేగాను। మాట్లాడే నోరునునేగాను। స్ఫురణగల అంతఃకరణానునేగాను। సంకల్ప వికల్పాత్మకమైన మనస్సునునేగాను। నిశ్చయగుణంగల బుద్ధిని నేగాను। చింత్తజేశెచిత్తమునునేగాను। దేహాంన్ని లేవనెత్తైఅహంకారమునునేగాను। గుణత్రయంనేగాను॥ నేనుఅభోక్తను। అర్థమాత్రకు అవలివాడను। శక్తిత్రయాతీతుడను అనియెరుగునది.

33. జీవునికారణశరీరం.

జీవునికారణశరీరం॥ అజ్ఞానం। గుణసాంమ్య మాయా। దీనిసేరేమహత్తత్వం। మకారమాత్ర। విస్మరణ। సుషుప్త్యవస్థా। ప్రాజ్ఞుడభిమాని। తమోగుణం। దీనందువాయురూపమైన-వుశ్వాసంవుంన్నదిగనుక। యిదితిరిగేటందుకు ఆకాశంవున్న దనవలెను। ఆకాశానిలములువుండబట్టె। అనలజలాలువున్నవనవలశెను। యివిఅంన్నీవుండేటంచుకుభూమిగావలెగనుక-అదీకూడావున్నదని అనుకోవలశినది। యీబీజరూపాలైనపంచభూతాలుగలశినదానిపేరే కారణశరీరం। దీనికిస్థానంహృదయం। చిదాత్మాహంకార జీవాత్మసంగమమే కారణతనువు। ఆకాశాహంకారములు - కారణతనువు। దీనికిహృదయస్థానమే - ద్రవ్యశక్తి। ఆనందభోగం। పరమాత్మ పారమార్థికుడు।యిదిసాభాస। అవ్యాకృతం। దీనికిఅంగుష్టార్థప్రమాణం। కృష్ణవర్ణం। పశ్యంతివాక్కు। ఆనందభోగం। మకారమాతృక। యిదిప్రణవ తృతీయ్యాపాదం।

యిదిసత్తుగాదు-అసత్తుగాదు-సదసత్తులుగాదు। ఆత్మకు భిన్నంగాదు। అభిన్నంగాదు। భిన్నాభిన్నంగాదు। సావయవంగాదు। నిరవయవంగాదు। ఉభయంగాదు। ఇది ఆనందమయకోశం.

## ౩౮. జీవునిసూక్ష్మశరీరం.

జీవునిసూక్ష్మశరీరం ॥ ఉకారమాత్ర। స్వప్నావస్థ। తైజసుడభిమాని। సత్వగుణం। పంచప్రాణ-పంచజ్ఞానేంద్రియ - పంచకర్మేంద్రియ- మనస్సులుగలశి - షోడశవికారాత్మకం। సూక్ష్మశరీరమని కొందరన్నారు। బుద్ధిని గలిపి పదియేడవయవలిదని కొందరన్నారు। చిత్తాహంకారములగలిపి పందొంమ్మిద వయవలిదని కొందరన్నారు। యిందులోనే అంతఃకరణను విషయపంచకాన్నికలిపి। యిరువైఅయిదు ఆవలియవలిదని కొందన్నారు। యీపైవి అన్నీ। ఒక్క అంతఃకరణపొట్టలోనివే-కనుక। కొందరు, ఒక అంతఃకరణనేఅన్నారు। కొందరు విషయ పంచకాన్ని తీశివేశి। భూతపంచకాన్ని కలుపు కొన్నారు ॥ దీనికికంఠస్థానం। అగ్నివాయువులుగలశి। సూక్ష్మశరీరమనబడునుజ్ఞానేంద్రియపంచక। కర్మేంద్రియ పంచక। మానసాద్యంతఃకరణచతుష్టయం। తత్కర్మ। కాలం। భూతపంచకం। దశప్రాణాలు - యిట్టి అష్టపురంబులుగలది। దీనికి ఇచ్ఛాశక్తి। స్వేచ్ఛాభోగం। అంతరాత్మ। ప్రాతిభాసికుడు। యీదేహంవాసనకు బిఘారమైనది ॥ దీనికివివిక్తభోగం। ప్రాణధర్మమనోధర్మాలై

నక్షుత్పిపాస శోకమోహాలనే ఊర్మిచతుష్కం గలదు। అంధ-బధిర-మూక-ఖంజ-పంగు-క్లీబత్వాది ధర్మాధర్మ స్వర్గ-నరక బంధమోక్షాలుగలది। ప్రాణమన్నో విజ్ఞాన కోశత్రయాత్మకమైనది। అంగుష్ఠప్రమాణంగలది। శ్వేత వర్ణం। యిదివిశేషశక్తి.

### ౩౫. జీవునిస్థూలశరీరం.

జీవునిస్థూలశరీరం। యీదేహంఆత్మస్వరూపంకాదు। ఆత్మస్వరూపంవేరే। దేహస్వరూపంవేరే। దేహంపాంచభౌతిక ఆకారం। యిదియెట్లాగంటే॥ పంచభూతాల నుంచిధాన్యంనిర్మాణమైనది। ఆధాన్యమువలనఅన్నం అవుతుంది। ఆఅన్నమునుంచిదేహనిర్మాణం అయినది! యీదేహంపేరు అధిష్టానం। దీనికి అకారమాత్ర। జాగ్రదవస్థ - విశ్వుడభిమాని॥ రజోగుణం॥ ఆకాశాంశమైన - రాగద్వేషభయలజ్జామోహాదులును। వాయుఅంశమైన - చలనవలనధావన। అకుంచనప్రసరణాలున్ను। అగ్నిఅంశమైన క్షుత్తృష్ణా నిద్రాలస్య సంగమాదులున్ను। ఉదకాంశమైన। లాలమూత్రస్వేదరక్త శుక్లములున్ను (శుక్లమనగా=చీముకర్థము) పృథ్వి అంశమైన అస్థిమాంసత్వఙ్నాడీరోమాలున్ను కలిసిన। యీ యిరువైఐదింటిపేరుస్థూలదేహం। యిదితొంబయిఆరు అంగుళాలేకాని, యెనిమిదిజానలేకానిపొడవు। నాలుగుజానలవెడలుపు-దీనిలోడెబ్బదిపెద్దయెముకలు। యెనిమిదిపలాలుగుండెలు। నూటతొంబదిమర్మస్థానాలు। డెబ్బదిరెండు

సంధులు। ముప్పదియారుపిడికిళ్ల మాంసం। ముప్పదిమూడు కోట్ల రోమంబులు - డెబ్బదిరెండువేల నాళ్లు । ముప్పది మూడుమూళ్ల పెద్దపేగు । అర్థ శేరు రుధిరం । ఒకసోల పైత్యం। అరసోలెడు శ్లేష్మం వుండును ॥ దీనికియుక్త భోగం క్రియాశక్తి। జీవాత్మవ్యావహారికుడు । యీదేహం లింగ శరీరానకు । బిహారమైనది । దీని పేరే భూతకర్దమం । దీనికిస్థూలభోగం । ప్రణవప్రథమపాదం । అన్నమయకోశం । ఆవరణశక్తి । స్థూల,కృశ,హ్రస్వ, దీర్ఘ,ప్లుత, దేవదత్త - యజ్ఞదత్త - ధనుంజయులనె । నామరూపవర్ణాశ్రమ । కులగోత్రాదులుగలది । పితృసంబంధమైన- మజ్జ-నాళ్య-స్థులనే । కోశత్రయమున్ను । మాతృసంబంధమయిన । చర్మమాంస రుధిరములనె । కోశత్రయమున్ను। కలశినషట్కోశాలది ॥ అస్తితే-జాయతే- వర్ధతే-పరిణామితే - అపక్షియ్యతే-వినశ్యతులనె - షడ్భావవికారాదులుగలది ॥ అంగుళం- నవప్రమాణం ॥ రక్తవర్ణం । దీనికిజననమరణాదులనే ఊర్మిద్వయంగలది.

ఇంకాకొన్ని ఆవశ్యకమయిన వివరములు యీగ్రంథములో గ్రంథ బాహుళ్య మవుతుందని సలిపి, మావల్లనే, యీగ్రంథము వెంట వేరే రెండుగ్రంథములు అచ్చు వేయించియున్న వాటిలో సంపూర్ణముగా అతి ముఖ్యాంశములు వేశినాము గనుక తెలియగలందులకు యిచ్చట యీమాటలువ్రాయబడినవి.

---

## శ్రీశివరామ దీక్షితులవారిబోధ-వచనరూపము

పల్లవి.

ఏమిజెప్పుదు-పరమగోప్యముయెందుదోచకయున్నది

అనుపల్లవి.

ఏమిగాకను - యేమిలేకను । యేమియేమనరానిదీ ॥

చరణములు.

నామరూపములేనిదీ - అదినాశమెన్నడుగానిదీ । సామవేదాతీతమైనదిసగుణభేదములేనిదీ॥ ౧ ॥ ఉన్నదున్నట్లున్నవారికివున్నదేతానైనదీ-వున్నదేమోవున్నదీ।అదివ్యూహసోహాలులేనిది ॥ ౨ ॥ ద్వాదశీతోగూడిపాయక తగులుకొనితానున్నదీ।యాదిమరచినమర్పులేనిది-యెంత్రచిత్రంబైనది॥౩ ॥ చూపులేనిదిరూపులేనిది-సుఖముదుఃఖములేనిది । చూపుచూడక-చూపువారికిసులభమైతానున్నదీ। ౪ ॥ ఎంత్రవారికిదుర్లంబది - యెంతకఠినంబైనది। సంతతముధ్యానించువారికి-స్వతఃసిద్ధంబైనది ॥ ౫॥ సర్వసర్వాంతరముతానై-సర్వకల్పనలేనిది । సర్వపావనమైనవారికి-సదనమైతానున్నదీ ॥౬॥ ఖండఖండముగానిదిఅది-కర్తమార్గముగానిది । అండబాయకనుండి అంతట-నిండితానై యున్నదీ ॥౭॥ సోహభావముశూన్యమైనది-చూపచెప్పనరానిది । సాహసంబునగుణనిక్రృపగల-సాధుసమరసమైనది ॥౮॥ పుట్టుచావుపూర్వపరముల-పుణ్యపాపములేనిది । బట్టబయిటనేవున్నదిఅది-బ్రహ్మమెన్నడుగానిది । ౯ ॥ హరిహరాదులకందరానిది- అండపిండములేనిది । నాహకెన్నడుయెరుకలేకనె-యెదుటనేతానున్నది॥ ౧౦॥

పగలు రేయునుగానిదిఅది-పట్టముట్టగరానిది । అగణితం
బై సకలదేశము-లందు తానేయున్నది॥౧౧॥ నిర్మలముని
ర్బీజమైనదినిండివెలితియుగానిది । కర్మలై చెరియించుదు
ర్మద-కండ్లకగపడకున్నది ॥౧౨॥ సర్వకాలము వక్కటీ
రై సాక్షిలేకనెయున్నది । కూర్మితో దుతనేను నేననే-గురు
వులకుగురువైనది ॥ ౧౩॥ ఎరుకయెన్నడులేకయితరము-
యెరుకలేకనెయున్నది । రాకపోకడలేనిది-అదిరాజమా
ర్గంబైనది ॥౧౪॥ మొదలుకొనలును లేక అంతట-మొనశి
యెడతెగకున్నది। బదులులేక నేకదలకున్నది-భావగమ్యం
బైనది॥ ౧౫॥ ఎప్పటికితానొక్కటీరై -గొప్పకొంచెముగా
నిది। యిప్పుడప్పుడుయెప్పుడనకను-ముప్పులేకనెయున్నది॥
౧౬ ॥ ఉన్నదున్నదిలేనులేదనె-వుపమశూన్యంబైనదీ।
చెన్నుమీరగ తెలివిగానిది-చలనమెన్నడులేనిదీ ॥ ౧౭ ॥
అనుమతములుగానిదీఅది- అప్రమేయంబైనది । దూర
శ్రవణముదూరదృష్టికి-దూరమైతానున్నదీ॥ ౧౮॥ దేశమ
న్నదిలేనిదీ-వుపదేశమన్నదిగానిదీ । దేశదేశములందుత
నకొక-దేశమనిగురిలేనిదీ॥౧౯ ॥కంటిలోపలయెరుకబ్రహ్మ
ము - కామకాదనరానిది ।వెంటవెంటనెదంటబాయక-
తంటలేకనెయున్నది॥ ౨౦॥ ఊరకున్నదియెందుదోచక -
వుండిలేనిదిగానిది । కోరికెన్నడులేకఅది- వైకుంఠమైతా
నున్నది ॥౨౧॥ ఎరుకలేనిదిమరుపులేనిది- హేతువెన్నడు
లేనిదీ । కరుకుమెత్తనలేక కార్యా-కారణముగతమైనదీ॥
౨౨ ॥ ఘాతశత్రులఘాతబాందవు-కలిమిలేములులేనిదీ।

భూతపంచకశూన్యమైనది-పురుషరూపముగానిది॥ ౨౩ ॥
ఎప్పుడంటేఅప్పుడున్నది - చప్పుడన్నదిలేనిది । తప్పుతా
కులుబలుకుహీనకు-తర్కులకుఅదిలేనిది॥ ౨౪॥ అంతరంత
రమేమిలేక - నిరంతరముతానైనదీ । వింతలేమియులేక
అది - ఆద్యంతశూన్యంబైనది ॥ ౨౫ ॥ ఇందుఅందును
యెందుజూచిన - అందెతానై యున్నదీ । సందులేకను
యెందుబోకను-అందిపొందికలేనిదీ ॥ ౨౬ ॥ ముద్రలఆపో
జ్యోతి - ఆరుమూర్తులాశలులేనిది । భద్రమైఅతిగో
ప్యమైనది - భావగమ్యంబైనదీ ॥ ౨౭ ॥ వేదశాస్త్రపు
రాణములకది - వేద్యమెన్నడుగానిదీ। వాదభేదముజేయు
మూర్ఖుల-వశముగాకనెయున్నదీ॥ ౨౮ ॥ చిక్కులేకసనా
తనంబై-చిత్రమెన్నడులేనిదీ । ద్రుక్కుదృశ్య వివేకులకు
అది-దూరమైతానున్నదీ॥ ౨౯ ॥ నిద్రహారము లేనిదీఅది-
నీవునేననరానిదీ । యెదురుబడివాదించెవారికి-యెన్నటికి
అదిలేనిదీ ॥౩౦॥ పట్టువిడుపులు లేనిదీఅది -పరమరహితం
బైనదీ । గుర్తుమీరినవారికెయ్యెడ-గురుతులేకనెయున్న
దీ ॥౩౧॥ శూన్యమెన్నడుగానిదీ-పరిశుద్ధమైతా నున్నదీ ।
మాన్యులై చరియించుశరణుల- మార్గమైతానున్నదీ ॥
౩౨॥ తనుమనంబులులేనిదిఅది - తత్వమనియనరానిది ।
తనకుతానైనిరామయంబై - తానుతానై యున్నది ॥ ౩౩ ॥
కార్యమేమియులేకసర్వము-కల్పితంబదిగానిది । ఆర్యుల
ముమేమనేటివారి-కసాధ్యమైతానున్నది॥౩౪॥ అంగత్రివి
ధముగానిదిఅది-సంగరహితంబైనది । లింగషడ్విధభావ

లీలల-లీనమెన్నడుగానిది ॥౩౫॥ భావలింగముగానిది-ని
ర్భావమెన్నడులేనిది। సావయముని రవయముగాకను-స్వ
గతభేదములేనిదీ ॥౩౬॥ యుగయుగంబులకందరానిది -
యుక్తియుక్తముగానిది । త్రిగుణరహితంబగుచుఅంతట-
త్రిపుటిభంగంబైనది ॥౩౭॥ నిరాకారాకారములకది-నిల
యమనరాకున్నది । నిరాధారాధారులకుఅది-నిరాధరం
బైయున్నది ॥ ౩౮ ॥ సృష్టికల్పనలేనిదిఅది-సూక్ష్మరూప
ముగానిది । వ్యష్టిసమిష్టికనంతరంబై -వేదవాదములేనిది॥
౪౦॥ వాచగోచరమైనదిఅది-తోచితోచకయున్నది । ఉ
చ్ఛనీచములేనినిజగురు-సూచనకులోనైనది ॥౪౧॥ అచల
మన్నదిలేనిదిఅది-అహంబ్రహ్మముగానిది । సచలమైచెడి
పోయ్యేవారికి-చాలదూరంబైనది ॥౪౨॥ కామరహితము
నేమరహితము-ప్రేమరహితంబైనది । మామతమెదొడ్డ
దనియే-మానవులకదిలేనిది ॥౪౩॥ ఒకటివున్నదనేదిలేని
ది-వకటినెక్కటిగానిది। తగనగుంథతిలానసేసాంప్ర-దా
యకులకదిలేనిది ॥౪౪॥ కాకకావలెనన్నసూచన-కలదు
లేదనరానిది । లోకవాసనవిడువనేరని-లోకులకుఅదిలేని
ది ॥౪౫॥ అక్షరాక్షరతీతమైనది-ఆత్మభావనలేనిది।లక్ష్య
శూన్యంబైనవారికి-లక్షణంబైయున్నది ॥౪౬॥ నిత్యమైన
దినిరుపమైనది-నిర్వికారంబైనది। సత్యాసత్యము రెండుగా
నిది-స్వల్పమతులకులేనిది ॥౪౭॥ ముట్టరానిదిపట్టరానిది-
మూలమెన్నడులేనిది । బట్టబయిటనెవున్నదిఅది-ప్రాప్త
మెవరికిగానిది ॥౪౮॥ ఉన్నదన్నదిలేనిదిఅది-వూహాపోహ

లులేనిది। కన్నవారికిలేకయున్నది-కానబడితాగానిది ॥ ౪౯॥ తోడులేనిదినీడలేనిది-తోడుతోడనెవ్వున్నది। జాడతెలియనివారికినిఅది- యేడజూచినలేనిది ॥౫౦॥ బోధసాధనలేనిదిఅది-బోధరహితంబైనది। సాధుబోధలగోష్ఠికందక-స్వాదః-కంబైవున్నది ॥౫౧॥ ఇష్టమంన్నదిలేనిది- అదిశిష్టమెన్నడుగానిదీ। అష్టమూర్తులకీవలావల - అంతమైతాన్నున్నదీ ॥౫౨॥ ఊరులేనిది పేరులేనిది- పేరులేకనెయున్నది। దారిదప్పిచరించుదుర్గుణ-తామసులకదిలేనిది ॥౫౩॥ పంచవింశతిఆత్మగానిది - పంచబ్రహ్మలులేనిది। ఆదిసన్మునివరులకెల్ల- నభేద్యమైతానుంన్నదీ। వేదమతశిద్ధాంతులకుఅది- వేద్యమెన్నడుగానిదీ॥ ౫౪॥ ఏమిలేదేమిలేదనియే-దేమిలేకనేయుంన్నదీ। యేమిలేనిదిలేకనేతానేకమెంన్నడుగానిదీ॥౫౬॥ తానెనేయెరుకేమిలేనిది-ధర్మాధర్మముగానిదీ। తాననేఅద్వైతవాదుల- తరముగాకనెయున్నది ॥ ౫౭॥ మనసులేనిదిగనుకఅది-అమనస్కమనరాకుంన్నదీ। ఘనమనోహరరాజయోగుల - కలవిమెన్నడుగానిదీ ॥౫౮॥ ఇతరమెంన్నడులేనిదిఅది- యింత్రయెంత్తనరానిది। పతితులైవిలశిల్లుమూర్ఖుల-గతికిదూరంబైనది ॥౫౯॥ సకలశాస్త్రపురాణములకది-నికరమైతాన్నున్నది। శుకులవంటివిరక్తులకుఅది- సూచనెన్నడుగానిది ॥ ౬౦ ॥ మరుగులేనిదితరుగులేనిది - మంత్రతంత్రములేనిది - ధరణిలోగురుశేవజేయనియ-ధర్తులకుఅదిలేనిది॥ ౬౧॥ యోగయోగాతీతమైసం- యోగమెన్నడు

లేనిది - రాగద్వేషములేనివారికి। లక్షణంబై యున్నది॥
౬౨॥ కల్మిలేనిదిబలిమిలేనిది - కలతలెన్నడు లేనిది।
కులముజాసుపుపతితులకుఅది-గురుతులేకనెయున్నది॥౬౩॥
గతియులేనిది మతియులేనిది - రతియులేకనెయున్నది।
యితరమైచరించువారికి। అంతరమైతానున్నది॥౬౪॥ ఎం
నుజూచినవున్నదిఅది - ఎందులేకనేయున్నది। సంను
లేకనుయెందుబోకను - అందిపొందికలేనిది॥౬౫॥ ఒప్పు
తప్పులులేనిదిఅది- వ్యూహభావనగానిది - చెప్పచూపగ
రానిదిఅది। చేటులేకనెయున్నది॥ ౬౬॥ మూలమాయ
కుమూలమగు- త్రిమూర్తులకులోగానిది। కాలనేమము
లేకఅది। బహుకాలమదియైయున్నది ॥ ౬౭॥ క్షేత్రపా
త్రవిరహితమైనది - జంత్రశూన్యంబైనది। క్షేత్రమెన్న
డులేకఅది-సాక్షాత్కారంబై వున్నది॥౬౮॥ఉత్తమోత్తమ
మగుచుఅదిసు - శ్రోత్రములుతానైనది । సత్తుచిత్తా
నందమనియే - సగుణబ్రహ్మముగానిది॥ ౬౯॥ వర్ణరూ
పముగానిది - షడ్వర్ణ మెన్నడుగానిది। కర్ణనేత్రము
లొత్తిచూచిన - కళలకందగరానిది॥ ౭౦॥ ఇష్టమున్నది
లేనిది - వుచ్ఛిష్టమెన్నడుగానిది। అష్టమూర్తులకీవలా
వల - అంతమైతానున్నది॥ ౭౧॥ యోగయోగాతీతమై
సంయోగమెన్నడులేనిది- రాగరోషమదాంధులకు। నది
రహస్యమైతానున్నది॥౭౨॥ సత్యాసత్యము రెండుగానిది-
సతముగాకనెయున్నదీ। ప్రత్యగాత్మశివోహమనియె।భవ
వికారములేనిదీ ॥౭౩॥ గద్యపద్యములాదిగాగల - కావ్య

కల్పనలేనిది । మధ్యపానముసేయువారికి- మధ్యమైతాను న్నది ॥ ౨౮ ॥ సకలబ్రహ్మాండములుతనలో - జాడదెలియకవున్నది । సకలదేహములేనివారికి - సకలమైకలశున్నదీ ॥౨౫॥ లక్ష్యభేదములేనిది-నిర్లక్షులక్ష్యంబైనదీ । అక్షరాక్షరదోషరహితం - బన్నదెరుగకయున్నదీ ॥ ౨౬ ॥ నిరాకారాకారములకది - నిలయమనరాకున్నది । నిరాధారాధారులకుఅది - నిరాధారంబైనది ॥౨౭॥ మీసమేమనరానిదిఅది-వారునేననరానిదీ। మారుజన్మములెత్తువారికి - మరుగుపడితానున్నదీ ॥౨౮॥ త్రిగుణముల తాకానిది - అదితీవ్రశాంతముగానిది । గగనపంచకశూన్యమైనది - కండ్లకగుపడకున్నది ॥౨౯॥ ఒక్కటైన నుచింతలేనిది - వకటిరెండనరానిది । వక్కటై సమస్తమునకది-వకటిగాకనెయున్నది॥౩౦॥ గురువుశిష్యులమనియుపోయినగురుతులేకనెయున్నది - నసుడుదెలుపుటయేమొకా - యిదినాకునీకనరానిదీ ॥౩౧॥ చిక్కదెవరికి = దక్కదెవరికి । చిక్కిచిక్కకయున్నది - యెగ్గుతగ్గులనెంచువారికి । యెచటజూచినలేనిది ॥౩౨॥ తెరకుయీవలతెరకుఅవల - తెలియలేకనేవున్నది । సరకుసేయకచూడుమరి - అరిచేతిలోతానున్నది ॥౩౩॥ ప్రజ్ఞలేకనెయున్నది - అదిప్రకటమెన్నడుగానిది । యజ్ఞక్రతువులుయెన్నిజేశిన - యెన్నటికినిఅంటనిది ॥౩౪॥ బయలురూపంబయిన యీపరబ్రంహ్మ వాసనలేనిది - బయలుఅయిదిటిమీదిది - నిబ్బయలు తాననరానిది ॥

౮౫ ॥ నాదబిందుకళలమూటికనాదియనరాకున్నది । వేదమతశిద్ధాంత్తములకదివేద్యమెన్నడుగానిది ॥ ౮౬ ॥ సత్యజ్ఞానమనంత్తబ్రంహ్మము - జాడలేకనెయున్నది । కృత్యమెన్నడువిడువజాలని - క్రూరులకుఅదిలేనిది ॥ ౮౭ ॥ నీలఘూంబకు - ఆలయంబై నిజమునిజమైయున్నది । రాశ్లపూజలుశేయువారికి - రహస్యమైతానున్నది ॥ ౮౮ ॥ మూలమేమియులేనిది - అదిమూర్ఖులకుకన రానిది మేలుమేలై యుండు - సద్యోన్ముక్తితానై వున్నది ॥ ౮౯ ॥ అల్లమా ప్రభువులకు - నాలీలన్నదేమియులేనిది । యెల్లలోకములందుయెవరికి - యెరుక లేకనేయున్నది ॥ ౯౦ ॥ విశ్వదాభిరామవేమన - విడువనేరకయున్నది । విశ్వామందునకొందరికి । అదివిమలమైతానున్నది ॥ ౯౧ ॥ పరువుగాయిది - కృష్ణమూర్తికిపాలిదై వంబైనది । గురుకబీరుకుయెఱుకకెరుకై కుదిరికు-దురై యున్నది ॥ ౯౨ ॥ సారెకునుసంసారవారధి దూరువారికి లేనిదీ - మీరుసాహేబునూర్ మహంమ్మదు-గారినెడతెగకున్నదీ ॥ ౯౩ ॥ కలియుగంబున-మాయ - కాపుర కలికిమూలముగానిదీ । అలకిమహంమ్మదుగారికిని । అది అట్లుబాయకయున్నది ॥ ౯౪ ॥ ఉండిలేనిశరీరమందునవున్నదనరాకున్నదీ । సిండి అంతటనిల్కడెరుగకనిజమునిజమైవున్నదీ ॥ ౯౫ ॥ చెన్నపట్టణావై పురీ-వీశాఖపట్టణమాదిగా । వున్నయెదశివయోగగురులకునున్నతంబై యున్నదీ ॥ ౯౬ ॥ దొంగబాటలుగానిది-అదిదోషరహితంబైనదీ । లింగధారులవడుగులకు - అది

లీనమైనట్టుగానిదీ ॥ ౯౭ ॥ చదువువారికి విన్నవారికి - చాలుచాలై యున్నదీ । కొదువలేనిది-గనుక అదిరతికో ర్కెలేమియు లేనిదీ ॥ ౯౮ ॥ షట్సమాధులకందరానిది- సమరసైక్యము లేనిదీ । షడుస్థలంబులుగానిది - తనసరికి సరిసరిగానిది ॥౧౦౦॥ అచలభక్తశ్రేణికెప్పుడు- ఆశ్రమం బై యున్నదీ। సచలమైచెడిపోయ్యేవారికి-జాడదెలియకవు న్నదీ॥ ౧౦౧॥ మతము లేనిదీ-వ్రతము లేనిది।మహిమ లేమి యు లేనిదీ - సతతమునుశివరామదీక్షిత - సమ్మతంబై యున్న దీ॥౧౦౨॥పరమపదమనరానిది - అదిపరమరహితంబైనదీ పరమారాధ్యులగురునికృపగల-భక్తులకులోనైనదీ॥౧౦౩॥ ఫలితమైగిరినాధునకు నెడబాయకను తానున్నదీ। కలతవా క్యముగాదుయిది-గురుకరుణకారణమైనదీ॥౧౦౪॥అణుమ హత్తనరానిది- అదిఅతివినోదంబయినది।ప్రణవమహాధ్వ నులందుచిక్కని ప్రభువులకు- అది లేనిదీ॥ ౧౦౫॥ ఆదిఅంత్య ము లేనిదీ - అదినాదుబిందువుగానిదీ। కాదుకాదన లేదులేద నకర్తలేకనెయున్న దీ॥౧౦౬॥ వేదసారాతీతవిమలవిచారు లకేనిజసాక్షదీ।శ్రీధరుల శేవించికనేశివ- రామదీక్షితవరుల దీ॥౧౦౭॥కంబలూరప్పయ్యామంత్రికికరుణదీక్షితపరమదీ । ఆ - కంబలూరప్పయ్యనొసగెనుఘనుడుతనశిష్యునకదీ ॥ ౧౦౮ ॥పరశురామవంశశీతా-పతికిదొరికెనుపదవదీ-సరస మతియనిభాగవతశ్రీకృష్ణు-కుపదేశంబదీ॥౧౦౯ ॥ఏమిజెప్పు దుపరమగోప్యము మెందుదోచక యున్న దీ । యేమి లేకను యేమిగాకను యేమొ- యేమనరానిదీ॥౧౧౦॥

శ్రీమద్భాగవత శ్రీకృష్ణదేశికప్రభు మహారాజులవారి కృతం.

## ౧౨. ద్వాదశవిధబోధలు.

### ౧. విశ్వోద్భవస్థితిప్రళయాష్టకం.

సీ॥ జగదుద్భవస్థితి సంహారములు మీకు తెలిపెదవి నరయ్య తెల్లమిగను । జనులారసాధన సంపద్విశిష్టుడౌ స చ్ఛిష్యవరుడొక సద్గురునకు । జేయవలసిననాళ్లు శుశ్రూ షలొనరింపుచుండి వాడడిగె బ్రహ్మాండమెట్లు । జన్మించి వర్ధిల్లదంత్యస్థలమునకు జేరునోయిది దెలియజెప్పుమ నుచు । వినయమున మ్రొక్కి లేవక వేడుచున్న । జూచికరు ణించిభక్తికిచోద్యమంద్రి । తెంప్మి తెల్పెదననివానిలేవనె త్తి । త్రివిధదీక్షలుగావించి తెలుపవాంగే ॥౧॥

సీ॥ వినుమునీవడిగిన విశ్వోద్భవస్థితి ప్రళయముల్ వి నుపింతుబ్రహ్మమందు । బ్రహ్మమహామస్మను పలుకు లేని దెకల్గిపురుష ప్రకృతులయ్యెఘుట్టజేసె । ముగురుమూర్తు లవారి మూడులోకములను పుట్టించి రక్షించిపాలియజే యు । చంద్రుపీలోకములందుద్భాల్మకర్మవశంబున పిండము ల్ జననమగుచు । జనునుకర్మక్షయంబైనమునుగగనము । వంహ్నిపవనజలావనుల్ వరుసబెట్టి । స్వాంశములతోడనే గుస్వసానములకు। వాటిసంబంధులేస్తురువాటికొరకూ॥౨॥

సీ॥ శ్వాసలాశైనను జరుగునొక్కవిఘుడియ యువియా రుపదులైన నగునుఘుడియు। యువిరెండుమువ్వదులైన న హొరాత్రమానది మూడునూల్లరు వదరుగ । నగు

వత్సరముమూడులనలువదిలక్షల యిరువదివేలవ్వొమెంచి చూడ । నైనయుగములునాల్గానవిరెండువే లరిగిననొక దినంబగునజునకు। నతడువై మూల్లరుగ విష్ణుకగునుఘడి య । శంభునికిహరినై మూల్లజనిననగువిఘుడియు। శంభు డువై మూల్లగడునశక్తి కగునరవిఘుడియు।యిదెసువిూ కాలగణనా ॥3॥

గీ॥ ఎవరిశతవర్షములు వారికేగవారు । మేనికెడ బాశితిరిగి జన్మింతురట్టి । శక్తులకులెక్కలేదాత్మ జల ధియందు । వీచికలచందమున నున్భవించిచనునూ ॥४॥

క॥ వసధిప్రవాహమునలెమన । కనులకుగనుపించ్చిన ట్లుగాన్పించుజగ । జ్ఞననంబాత్మలో మృషయని । కనువా రికిప్రళయ పంచకములేదెపుడుఁ॥౫॥

గీ॥ జీవశివులనషుప్తులు జీవశివుల । తనువిసర్జనము లు మహాత్తత్వసృష్టి । లేనెలేదనిగురునిచేతానెరుగుట । ప్రళయపంచకమిదియెపోభక్తియుక్తా॥౬॥

క॥ అనవిని శిష్యుడుమునుపటి । తనమదిసంశయ ముబాశితానుండెనుయే । మనుజులుయిదివినిచదివిన । జ ననస్థితినాశములను జెందరువారల్ ॥౭॥

గీ॥ పరశురామవంశ భవునిసీతారామ । గురునిగొ ల్చియిట్టిగుట్టుభాగ । వతులకృష్ణు డనెడివసుధామరుడు దెల్పు । కొనిమెబోధలెవ్విగోరబోశా॥౮॥

ఇది శ్రీమద్భాగవతకృష్ణవిరచితవిశ్వోద్భవస్థితిప్రళయాష్టకంసమాప్తం.

॥౨॥ హంససంచార చతుష్కం.

సీ॥ హంససంచారప్రశంసమీరిదితెల్పు వినరయ్యాజను లారమనసుపెట్టి। యొకశిష్యవరుడు దేశికచక్రవర్తిని। గ నిప్రశ్నజేసెయీకాయమందు। హంసచరించునంచనవింటి నవిదెల్ప వలెనన్న వినిగురువరుండనియె। యొకదినంబునిరు వదొక్క వెయ్యిన్నాగునూర్లు తిరుగుగుదమూదిగాను। గు ధమునగుహ్యమున నాభికుహరమందు। హృదయకం ఠాక్షి మూర్ధ్నులవదలకారు। నూరులార్వేలునరువది నూరులారు। వేలువెయివెయ్యివెయిమార్లు వేసరిలక ॥౧॥

సీ॥ తెలియుమాధారస్వాధిష్ఠానమణిపూరకనాహతవి శుద్ధకమలములకు। మీదనాజ్ఞేయమామీదసహస్రార ముందునచటనేలుచుందుదొరలు। హేరంబవాక్పతివారి హరజీవేశగురువుల్దళంబులక్రమముగాను। నాల్గారు పది మూడునాల్గులుపదియారురెండు లైయుండునుదండిగాను శక్తులక్షరములుభూతసమితిబీజ। ములుదిశలుకాంతులు ముఖముల్ మొదలైనవి। గలవనేకములవియన్ని గ్రంథన జేసి। పెంచలేదిందుముచ్చటపెరుగుననుచు॥ ౨।

క॥ అనిగురుడుపదేశించ్చిన। వినిశిష్యుడుసంతృప్త మునవిస్మితుడగుచుం। వినుజనులత్యానంద్దం। బుననట్ల నెపొందగలరుబుధనుతులగుచుణ్ ॥౩॥

గీ॥ ప్రేమతోడపరశురామసీతారామ। గురుడుదెల్ప హంసనెరిగిభాగ। వతులకృష్ణుడనెటివసుమతీసుపడది। వదలడయ్యెమదినిముదముజెంద్రీ ॥౪॥

ఇతిశ్రీమద్భాగవతకృష్ణవిరచితహంససంచారచతుష్కంసమాప్తం,

3. దృగ్దృశ్యవివేకచతుష్కం ॥౪॥

సీ॥ దృగ్దృశ్యములరెంటిదెలిపెదవినరయ్యగురుమూర్తితనశిష్యవరుసిప్రజ్ఞ । గనగోరిశబ్దాదులనెరుంగువారెవ్వరనిన శ్రోత్రాదులంచనియెవాటి । గనెటిదో మనసుయామనసునోబుద్ధి బుద్ధినిబుద్ధియని తెల్సుకొనినవాడు । కలడో లేడో చూడుకలడుకల్గితెవాని నెరుగునాయివియంన్ని నెరుగవివిటి । నెరుగునతడతడెవ్వడో యెరుగదెల్పు । మనిననతడవునీవనేననిననీవె । యనుచుదెల్పినవినిబ్రంహ్మ మనగనేదో । తెల్పగదవయ్య మదినాటదేశికేంద్రా ॥౧॥

క॥ అనవినియుదధినిబుట్టిన । ఘనవీచికబృంద్ధమంద్దుకేమలముచ్వ్యాపిం । చ్చినమాడ్కినీవెత్రిజగం । బుననిండిన బ్రంహ్మవరసిబుద్ధినెరుగుమీ ॥౨॥

క॥ అనియీరీతినిబోధిం । చ్చినశిష్యవరుండుసంత్తసించ్చెనుయీబోధను । విన్నకంన్నమనజుం । డనిశముతనరూపునెరిగియానంద్దించుర్ ॥౩॥

సీ॥ ప్రేమజేసిపరశురామసీతారామ । మూర్తిదృక్కు దృశ్యములనుదెల్ప । కేరిభాగవతులకృష్ణుడువినిదృకస్వరూపమేనటంచ్చురూఢిజెంద్దె ॥౪॥

ఇతి శ్రీమద్భాగవతకృష్ణ విరచిత దృగ్దృశ్య వివేకచతుష్కం

సమాప్తం ॥3॥

## ౪. మహావాక్యవివరణపంచకం ॥౫॥

సీ॥ వినుడిమహావాక్యవివరణజనులారగురుమూర్తినో
కశిష్యవరుడడిగిన । నామహావాక్యములవిటియన్వయ
మునువినజెప్పెనీవునీతనుచతుష్క । మునుగూడిత్వంపద
మునకర్థమీశ్వరతనుచతుష్కమతండుతత్పదార్థ । మిరు
వురిదేహంబులిద్దరిగుణములు తొలగించి చూచినతుదప
దార్థ । మానుయీమూడుతత్వమస్యనెటివాక్యము। మ్యానీ
గుణములుకొద్దివధికమామహా । త్మునిగుణములుయిద్దరి
యంగములను । వినుముచెవియొగ్గితెల్పదవేరెవేరె ॥౧॥

సీ॥ స్థూలంబుమొదటిదిసూక్ష్మంబురెండవదికారణంబు
తృతీయ్యకాయమగుమ । హాకారణముతుదదగునీకుని
శునికివిరాట్టుతొలుకాయమువలిదగు హి । రణ్యాగర్భుం
డుకారణముప్రకృతిసర్వసాక్షి నాల్గవదగుసత్యమివిటి ।
తోటివచ్చునుబోవుతొలగకెనిమిది యాత్మలునుమాతృక
లునవస్థలుగుణములు । శక్తులభిమానులునుభూతసముద
యంబు । స్థలములవలి మహావాక్యసమితియందు । దీని
యర్థంబెకలిగుండుమానకెప్పుడూ ॥ ౨ ॥

సీ॥ అయమాత్మబ్రంహ్మయంచను వాక్యమిదికొనవేద
మందునగలదువెదకికొనుము । సామవేదంబునుజదివినత
త్వమస్యనువాక్యమగుపడువినుముమొదటి । వేదంబులో
పలవెదకప్రజ్ఞానంబ్రంహ్మయనెటి వాక్యంబుమనకెదొరు
కు। రెండవవేదమందుండ్త హంబ్రంహ్మాస్మియనువాక్యమది
వెదకినగనుపడు । నిన్ని వెదకంగనేటికియన్నిగురుని ।

వద్దగల్గును శేవించ్చదిద్దితెలుపు । ననినవినిఁమ్రొక్కి యీ మహాత్మునికరుణను । మోదమునజెంద్దెనప్పుడామునుకు జనుడయీ ॥ ౩॥

గీ॥ అతనివలెనెదీనిసతతంబుమరువక । చదువుచుం న్నవినినసకలవేద । సారమెరిగిచిత్త చాంచల్యమునుమాని । నృతతిజెందుపరమగతినినిజమూ ॥౪॥

గీ॥ ప్రేమతోడపరశు రామసీతరామ । గురుడుదెల్ప వేదగుహ్యామెరిగి । పరమశాంతినొంద్దెభాగవతులకృష్ణ । భూసురుండుపూర్వపుణ్యామేమో॥౫॥

ఇతి శ్రీమద్భాగవత కృష్ణవిరచిత మహావాక్యవివరణ పంచ్చకం సమాప్తం ॥౪॥

౫. ప్రణవార్థప్రకాశికాత్రయం ॥౩॥

సీ॥ జనులారప్రణవార్థమునుసద్గురునిజేరిసచ్ఛిష్యుడడిగినసంతశించ్చి । వినుమనిచెప్పెజీవునికినాల్గంగ్గముల్ గల వీశ్వరునికినాల్గంగ్గములును । గలవవిలోచనకంజ్ఞాతమునజూడుమెరుపుతెలుపునలుపుమేఘువన్నె । లివిజీవతను కాంత్తులెరుపులోపచ్చనతెలుపులోపల నలుపునలుపులోన।శ్యామమునునీలమంద్దునస్ఫటికకాంత్తి।గలుగునివియీశ్వరునిదేహకాంత్తులిన్ని।తనువులకుమీద శుద్ధపీతస్వరూపు । ద్వైతబ్రహ్మంబుగలిగుందునతడెసీవూ ॥౧॥

క॥ అనిచెప్పినదేశికునకు । వినయంబునమ్రొక్కిలేచి వినుతించ్చిముదం । బునజెంద్దెనట్లుతద్భో । ధనువినుకను నృతతిజెంద్దుతద్భావమునన్ ॥౨॥

గీ॥ పరశురామవంశభవుడుసీతారామ । ధరణి సుగుడుదెల్పదానిభాగ । వతులకృష్ణుడెరిగివదలకతలపోయ । ద్రోణగెమనసునెటకుదొలగనియక ॥౩॥

ఇతి శ్రీమద్భాగవత కృష్ణవిరచిత ప్రణవార్థప్రకాశికాత్రయం సమాప్తం ॥౪॥

౬. పరిపూర్ణబోధాష్టమాలిక ॥౮॥

సీ॥మరియొకనాడుసద్గురునిగంన్గొని ప్రమోక్షప్రస్తుతిగావించ్చిపణతిబలెక । భువిలోనరాముడుగుశివరామదీక్షితుల్ వచనకావ్యంబుగనచలబోధ । గల్పించ్చెనటదాంన్ని కరుణించ్చితెల్పుమంచనవినిసంతోషమునగురుండు । పరిపూర్ణమొకటిలేనెరుకనేదొకటుండుపరిపూర్ణమునెరింగినెరుకనువిడ । చాలునికయేమిబట్టదో సఖయయనిన । యచలమననేదిలేనెరుకనగనేది । యెరుకనెవ్వరు బుట్టించియణగజేతు । రయ్యవిస్పష్టముగబోధజెయ్యవయ్యా ॥౧॥

క॥ అనిప్రార్థించ్చినహర్షం । బునపరిపూర్ణమును జూపిపురుషయువతులై । కనుపట్టలేని యెరుకను । కనుగొనుమనిచూపిదీంన్నికలదనకుసుమీ ॥౨॥

క॥ పరిపూర్ణమనినయచలము । యెరుకనవిశ్వంబుతనువులెరుకననేనీ । వెరుకన సంకల్పంబగు । యెరుకనెయెరుకనుత్యజించ్చయెరుకేపోవు ॥౩॥

క॥ లేనికలమేలుకొంన్నను । తానెక్కడనిల్వనట్లుదబ్బరయగునీ । వీనిగ్గలబోధనుమే । ల్కనుకలవంటియెరుకగనరాదుజుమీ ॥౪॥

క॥ పరిపూర్ణముపరిపూర్ణము । నెరకనుగురుతెరుగ దెరుక మెరుకనచలముం । మెరుగునుగురువెప్పటికీ । మెరుకనుగనబోకుపోనియేమిటికింక్కన్ ॥౫॥

క॥ వినుముపరిపూర్ణమంద్దున । తనకై తాబుట్టిమెరుకతనపుట్టిల్లుగాం । గనబోవతనకుదానె । కనుపడదీవిశ్వమంత్తగనుపడదుసుమీ ॥౬॥

క॥ మంత్రములురెండుగలవా । మంత్రంబులలోనమొదటిమంత్రమచలముం । మంత్రించునెరుకనావలి । మంత్రముమంత్రింపుచుండుమరువకరెంట్టిన్ ॥౭॥

సీ॥ తలపోయుచుండ్డుముతరుణినిండ్నైవరైనబోధించుమనవారిబుద్ధినెరిగి । తగినవారైరేని తప్పకబోధించుతగనివారైరేనితగదుతెల్ప । నిండ్నెండ్నారీతులనేపరిక్షించ్చియీబోధనీకెరిగి స్తిబోధజేయ । తగినదానవటంచుదయజేశిసుజనులతోపొంద్దుసలుపుముదుష్టజనుల । పొందుకలనైన జేయకప్రొద్దుగడుపు । చుండుమనిచెప్పితానూరకుండెనంత్త । జాలమాంబయుసద్గురుమూలముననుమెరిగిపరిపూర్ణమున లేనిమెరుకనువీడె ॥౮॥

ఇతి శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభుశిష్యురాలగు తల్లావఝ్ఝుల జాలమాంబ్బా కోరికప్రకారం శ్రీకృష్ణదేశిక ప్రభువులవారెరచించిన పరిపూర్ణ బోధాష్టమాలిక సంపూర్ణం.

## ౭. పరిపూర్ణబోధాషట్కం ॥ ౬ ॥

సీ ॥ శ్రీరమాద్రైతుడౌనారాయణుని పేరవెలశిన గ్రా

మంబువిడిదిగాను। జేకొంన్నరామడుగుశివరామ దీక్షితు
ల్ రచియించినట్టియీయచలబోధ । నాయయ్యచేతకం
బ్బాలూరి అప్పయ్యమంత్రి దావినివచ్చి యంత పరశు ।
రామసీతారామరత్నమునకుజెప్పెనతడు నేననుభాగవతు
లకృష్ణ । భూసురుడువేడదెల్పెతద్బోధమీకు । విన్నవిం
చెదవినితప్పులున్నదిద్ద। వలశినదియింతె సజ్జనవర్యులార ।
భద్రయశులారకరుణాసముద్రులారా ॥ ౧ ॥

సీ ॥ ఈసృష్టికన్న ముంన్నేకమైనిత్యమై యాద్యంత
శూన్యమైయమితమగుచు । యెరుగుట మరుచుటలేప్రా
ప్తులేనిదై ద్వంద్వత్రిపుటులనుదగులనిదై । నామరూపం
బులెన్నటికిగైకొననిదై వాఙ్మనోతీతమై వగపు మురిపె।
మెరుగనిదై శబ్దవిరహితాకాశమై యిదియది యింతంత
యిట్టిదట్టి । దనుచుజెప్పంగరానిదై జననమరణ ములను
బొందనిదైవ్యోమమునకులోన । బైటగలదై ప్రపంచక
ల్పనకుజొరనిదై । వెలితిలేనియీవట్టిఅచలమందు॥ ౨॥

సీ ॥ తనకుదానరుదెంచి తనకుదాచనులేని సంకల్ప
ఘోకయరక్షణములోన । కోటిమాట్లవివెంచుకొనువారె
వరువేరెతనువుతోజగముతోదగులుకొని । నానావిధము
లైన నామరూపములతో తననుతాగనుగొనితానెముదు
సు । సాలీమరీతినిసకలప్రపంచ్చంబుసృజియించురక్షించు
సృక్కణంచు ॥ రాకపుట్టుటతాలేకపోకచావు । లవియు
మేలుకబల్ నిద్రలగును మొదలు । లేనిసంకల్పమే తాను
నేనుమేను । లగుచువర్తించుతనవంటిమగువనుగనీ ॥ ౩॥

సీ॥ పెండ్లాడినీవు నాపెండ్లామువేనునీ మగడనంచని కూడిమందిరములు। గట్టిపిల్లలగనిచుట్టరికెమొనరించివి శికిసంసారంబువిడచిగురుని। సంన్నిధి కరుదెంచి స్వామి యీసంసారవేదన బడలేనువేగనంన్ను। కడతేర్చుమని క్రొమ్ముక్క కరుణించి యీవృత్తబట్టబయల్ వునికిఘట్టిగాను। చెప్పినీవేమిలేదనిచెప్పెనతడు। గురుడుజెప్పినబోధపై గురిదగిల్చి। తనసమూహముతోదర్లెతానువచ్చి। నట్టిచోటికి యీబోధయిట్టిదిసుమీ॥ ౪॥

క॥ సంకల్పజాలమనియెడి। యంకిలిలేనట్టిచోటునరశినయంతం।సంకల్పముమాయమగుగ। సంకల్పపుజగము నిల్వజాలునెయవలగ ॥౪॥

క॥ బూటకపుగురుడుజెప్పే। తాటక తూటకలుగా దుతక్షణమునయే। పాటలునిలువవుయిదివిన। మాటలు తముదామెలేచిమాయముగావే ॥౬॥

ఇతి శ్రీమద్భాగవతకృష్ణవిరచితపరిపూర్ణబోధాషట్కంసంపూర్ణం॥౭॥

౮. గురుశిష్యసంవాదషోడశి॥౧౬॥

శ్రీమద్భాగవత శ్రీకృష్ణదేశిక ప్రభువులవారు - తమశిష్యురాలగు-తల్లావఝ్ఝుల జాలమాంబకోరినందున-రచించిన - షోడశి ॥

క॥ శ్రీమద్భాగవతాంన్వయ। తామరసాదిత్యకృష్ణ ధాత్ర్యమరునకుం। మామకగురునకు క్రొమ్ముక్కెమ। హామోదముతోడసజ్జనానందముగాగ ॥ ౧ ॥

క ॥ గురుశిష్యవచనములుగా । పరమరహస్యార్థమెల్ల బల్కెదవినుడో । నరులారతప్పులెన్నక । హర్షంబీరీతి యాటలాడించుజుమీ ॥ ౨ ॥

క ॥ సారముగనిసంసృతి నిః । స్సారముగాజూచినట్టి సద్గురుమూర్తిం । జేరియొక బ్రాహ్మణశ్రీః నేరుపుతో మ్రొక్కియెదుటనిలచిట్లనియెన్ ॥ ౩ ॥

క ॥ బిసరుహభవకులభూషణ । వసుధామరవర్యవిను తవరగుణబృంధా । వసుధీశవంద్యచరణా । కుసుమాయు ధశతసహస్రకోమలగాత్రా ॥ ౪ ॥

క ॥ అనివినుతిజేసినేనని । తనువునుదలపోయుచుంటి తద్దయుబ్రీతిన్ । మునుపిపుడిదినేగానం । చనితోచెను తెల్పవయ్య అతివిశదముగాన్ ॥౫॥

క ॥ నేననువస్తువమెట్టిదో । నేను విచారించి తెలియ నేరనుయీ మేన్ । దేనబుట్టినదో యెఱుగను । ధీనుతమద్గురు వరేణ్యదీనశరణ్యా ॥ ౬ ॥

సీ ॥ అనిపల్కవినిగురుండాపెతోనిట్లనె భూతక ర్దమము చేబొడమెస్థూల । తనువుదృశ్యంబగు స్తంభంబువ లెనీకు కనుకయీ దేహంబుగావునీవు । అన వినియయ్య నేనదిగాకమరియేమ్యపంచకృతనులై నపంచభూత । ము లజనించ్చినలింగమును నేననెటిభ్రాంతిడగిలె నీవదిగావు దాంన్నిబాయు । మనదానివిడిచినేననెటిదేమనియంన్న నీవునీవయ్యుండినిన్నునీవు । యెఱుగబోవుటకారణమెఱు

కసనినని|నదిమహాకారణముపీఁటినరయుదీవు| అవియునిన్నె రుఁగలేవనియనిన్రమొక్కి | చేతులుమొగిడ్చిప్రస్తుతుల్ జేశిజేశి ||౭||

సీ || పంచభూతములెందు ప్రభవించెననవిని యాత్మ లోనేనాత్మనెటిదొకటి|గలిగెమహ త్తత్త్వమలమహాతత్త్వ ముకుదయించెనొక గుణక్షోభిణియది | చెలగిసత్త్వాదుల సృజియించె తామసగుణము కంబరమను కొంకుకతనికి | వాయువాయువందనలమందుదకంబుబొడమె నాయుదక మందు | భూమియీయన్నిటికివిరాట్పురుషుడతడె| స్థూలతనువయ్యెశివునకుసూక్ష్మమఖిల | దేవతానీకమయ్యె నాదేవవిభుని | కతనికారణతనువుప్రకృతిసర్వ| సాక్షినాలవదేహమాసఖయవినవె | ౮ ||

గీ || అష్టతనువులవర్ణము లష్టగుణము | లష్టమాత్ర కలష్టాభిమానులష్ట | నిలయములుగలవవితమ్మునిన్నెరుగవు | యిన్నిటినినీవెమెరుగుదు వీవెనేనూ || ౯ ||

సీ|| అణుమహాచైతన్యమవ్యయ మవ్యక్తమజమచల మనంతమాత్మవీవు | అనవినికర్తృత్వమాత్మదోతనువు దోపాపపుణ్యద్వయఫలమెవరిదో | తనువునవెట్లుచైతన్య ప్రవేశమో ఉత్పత్తినాశంబులే తనువువా | యిన్నిటినెరిగించుమన్ననాగురుడనె ఖరకరదీపప్రకాశములను | జనులుతమతమస్వప్రయోజనములన్ని | జేయరవిదీపములు వాటికాయసాక్షు | లట్లనీతేజముననుయీయంగసమితి| కార్యములుజేయజూతువకర్తవరయా ||౧౦||

గీ॥ అరుకుడుదయించపగనిపశుఘ్నావనీసు। రులోనరించినపనులసూక్ష్యడు స్పృశించ। నట్లునుకృతాఘములను నీవంటవంగ। మెరుగదవిటెనిజడముదానెల్లెరుంగూ ॥౧౧॥

సీ॥ అనుభవింపుచునుండునజ్ఞాని యపుడుబాబుచ్చినిగనిపశిబాలరుఘడశి । నట్లుకుంమ్మరిజేయుకోట్లబౌనలయందుగగనంబుజొచ్చినగతినియాత్మ।జొచ్చుతత్వములలోవొచ్చిఘటోదకమునఘటముదొలిగినవనజహితుడు।జావలేదట్లాత్మజావడీదేహంబువిచ్చిపోయిననైదువిధములైన।ప్రళయములుగలవందుంలోప్రళయయుగము। పిండమందుండురెండుబ్రహ్మాండమందు । గలిగియుండునుగురునిచేగలుగునొకటి।ప్రళయమనుమాటవృషసుమీాపద్మనేత్రీ ॥౧౨॥

గీ॥ అక్షిపురుషాద్యుపాసనలాదిమైన । వెన్నొకలవాత్మనెరుగుటకన్నిటందు । యెక్కువైనట్టి దీబోధ పెక్కుపలుకు । లేలనామాటనమ్మితెచాలుచాలూ॥౧౩॥

క॥ అనిశమునీవీబోధను । మనమునమేమారబోకు మతివిభ్రమచే । మునుపటిమాయనుమెఱుగవె । నినునీలోనిలువనివమునిశ్చయముజుమీా ॥౧౪॥

క॥ అనిబోధించెనుదేశిక । జనపతితద్బోధనమ్మిజాలమదొలగెౕ । జననమరణములకట్లనె । వినువృతలికిమాతృగర్భవేదనయణగుౕ ॥౧౫॥

క॥ తల్లావర్ఘ్యులజాలమ। యుల్లంబీబోధమీాదయుని

చియితరమా । చిల్లరబోధలవిడిచెను। బెల్లముదినువాడు చేదుబెట్టునెనోటర్ ॥ ౧౬ ॥

ఇతి గురుశిష్యసంవాద షోడశీ సంపూర్ణం॥౮॥

౯. బృహద్వాశిష్ఠసారం ॥౫॥

సీ॥ శ్రీమద్రమాసుందరీమనోహరుడగు నారాయణాభిధానమునవెలయు । గ్రామనివాసియారామడగుశివరామదీక్షితుల్ తనశిష్యశిక్షకొరకు ।వచనకావ్యంబుగనచలబోధయైనర్చెనందులోగల యర్థమంత మీకు । వినజేతువినరయ్యజనులార వొకశిష్య వరుడు సద్గురునకు వందనములు । జేసితద్బోధనడిగినజెప్పెనిట్లు । సర్వగతమునునిత్యంబుస్థాణువచల । మునుసనాతనమునసంత్తమనజమనహ । మైనయీవుత్తిబట్టబయలంద్దులేన్దే ॥ ౧ ॥

సీ ॥ నీనాస్వరూపమైనిఖలప్రపంచమై నేనునీవనినన్నునిన్నెరిగెటిదై ।కారణములేనిదై కార్య కారణములురెండుదానైయై వెలశియమిత । వేదముల్ గల్పించి భేదములనుజెందికలిమిలేముల సుఖకష్టములను । పుట్టుచావులరెంటిబొందుచు నానావికారియై మాయనంజేరియదుగ । నేనుతనమీదివస్తువునిదుగొచూడు । మనినసవినయమునదానిగనిస్వకీయ్య । చిత్రములతోడ నిలువక చేరెనపుడు। తానువచ్చినచోటుకుతక్షణమునా ॥౨॥

క ॥ మేలుకగాథాసుప్తిని । యేలీలంవచ్చినిలిచి యేగునెనేనుం । ఆలీలవచ్చిపోయెను । నేలే నటువంటిచోట నిజగురుకరుణా ॥ ౩ ॥

క॥ అనిగురుడీరీతినిదెల్పినవినిశిష్యుండువానివిధమున యీబోధనుజెందెదీనిప్రేమను । వినువారలువారివలెనె వెలయుదురుజుమీ ॥ ౪ ॥

సీ॥శివరామదీక్షితుల్ జెప్పకంబ్బాలూరియప్పయ్యామం త్రియీయాయచలబోధ। వినిపిల్చివినజేశెతనశిష్యుడగుపరశు రామ సీతారామరత్నమునకు । వాగునేనను భాగవతకృ ష్ణుడదిగోరబోధించిరతనికాబోధనతడు । కలలోని వాడు మేల్కనినతాలేనట్లు యీప్రపంచంబుదానేమిలేక । పా యెవినినిల్చిపై మాటపలుకరాదు । చేటులేనట్టివోటపై కూటమంత్ర । వినుడియుల్లక్కియిదియైన వెదకిచూడ। నెందుగనరాదుసరెకదాయిదెసరిసరీ ॥౫॥

ఇతి శ్రీమద్భాగవత శ్రీకృష్ణవిరచిత బృహద్వాశిష్ఠబాణం సమాప్తం ॥౯॥

౧౦-అచలబోధాషట్కం ॥౬॥

సీ॥ వినరయ్యజనులారవినజేతుశివరామదీక్షితుల్ జేశి నతెనుగుబోధ। లోగలయర్థంబునేగంట్టిపరశురామసీతా రామరత్నమునకు । శేవజేయుచుప్రియ శిష్యుడనై భాగ వతకృష్ణుడను పేరవసుధమీద। వెలశితియాబోధవృత్తాం తమెఱుగక నంబరబోధనియపహశించ్చి । వినరుకొండ్దరు వినకుంన్నవిలువదిగునె । వకమహాత్మునిగనిశిష్యుడొకడడి గిన । నతడువానినిజూచియిట్లనిమెదీని । వినుమునామా టమీాదసీమనసునిలిపీ ॥౧॥

సీ॥ అహామనేదానినియంట్లనిజముదా నవికారిగనుక

నేనసదులేని। అహామనేమాటత దవికారినెరుగదా య
వికారిలోజేరియాడుచుండు । యిదెపంచ్భభూతాల నేవు
తోనీనిన తల్లితల్లినిగంన్న తల్లిదండ్రి । అవికారియొకటుం
న్నదని తెల్సికనిదానిలేనినేలేనని తానెరిగిన । నేనునిలచుం
డ్డదదిబోవదానివెంట్టు। దానిసంత్తతియేగునుతత్క్షణమున।
మొదటిదచలంబురెండోది మొదలులేని । యట్టియీగురు
తెరుగుమేననివచించ్చీ ॥౨॥

క॥ అనహామునకహామునకుసు । త్తినిమేల్కనుదీటుజే
శివినుమహామునుమే । ల్కనురెంట్టిదీశివేశిన । ననహాము
గాఢాసుషుప్తులాపైనిలుచుర ॥ ౩ ॥

సీ॥ మొదలులేకనెవచ్చిమొదలై ప్రపంచంబుపుట్టించి
రక్షించ్చి పొలియజేయు । నిదియెమూలం లేనియీగురు
తెరిగేశరీరంబు దానవికారియైన । యీవుత్తబయలేవుం
న్నదందునేలేననిగుర్తెరిగి లేకయుంన్న । దానితో పోవు
దానిప్రపంచంబు మిగులదంబరమైనమిగులునట్టి । వస్తువ
చలంబునిత్యంబు వాస్తవంబు। సర్వగతమజమవికారిస్థా
ణువెనుక । మనుపులెనుగనిదింత్తైనమరుగు లేక॥ నిబిడమై
య్యుండియున్నదినేనుగాప్డి ॥౪॥

క॥ అనిగురువరుడెరిగించ్చిన । వినియతడాబోధజెంద్దె
వేద్కనుయీబోధనువింన్న కంన్ననరుల । ట్లనెలదోచ్ఛేధార్థ
మబ్బియహామనరుజుమీ ॥౫॥

గీ॥ ఉంన్నదానిలోన వుల్ వులై వ్యాపట్టి। గురువసుం

డుశిష్యవరుడువారి। బోధనేనుమీకుబోధించ్చినదిమీర।
లేనుళక్యుశక్కితానుశక్కి ॥౬॥

ఇతి శ్రీమద్భాగవత కృష్ణవిరచిత అచలబోధాషట్కం
సంపూర్ణం ॥౧౦॥

## ౧౧. గురుశిష్యసంవ్వాదైకాదశకం ॥౧౧॥

సీ॥ శ్రీమద్గురు పరశురామ సీతారామమూర్తినిధ్యాం
న్చించ్చిమ్రొక్కివినుతి। జేశిచేశెదగురు శిష్యసంవ్వాదం
బువినరయ్య జనులార వేడ్కతోడ। సాధనచత్వారిసంప్ప
ద్విశిష్టుడై శిష్యుండునాల్గుశిశ్రూషణములు। కరుణారాగు
రునకుగావించ్చియొకనాడునేను మేననుకొంట్టినేటిదనుక।
యిపుడువేరనితోచెను యీశరీర। మెట్లగలిగెనునేననసే
మిటిదియొ। తెల్పగదవయ్యయిదిలెస్సదేశికవర। పరమ
కారుణ్యరసపూరభవవిదూరా ॥౧॥

క॥ అనిప్రార్ధించినవినుమని। తనహస్తముమస్తకము
నతగనిడిబోధిం। చ్చెను భూతకర్దమంబున। గనుపడు
యీస్థూలతనువుగలిగెనుజడమై ॥౨॥

క॥ ఇదినీవుగావుదీనిని। వదిలిసుఖంబుండు మనిన
వాడిట్లనియెం। యిదిగాకనునేనెవడను। వదలకవేవేగ
దెల్పవలెనననతడుం ॥3॥

సీ॥ వినుముయీదేహంబు విడచియపంచీకృతముళై
నపంచభూతములవలన। గలిగినయీసూక్ష్మ కాయంబు
నేననితలపుచున్నాడవుదానిబాయు। మననదిబాశినేన

ననేమియనియుంన్న నీవునీవై య్యుండినేనెవడనో। యను కారణశరీరమునుబట్టియున్నావు తలగియీదేహంబుదల పకుమన। వినిశరీరత్రయమునునేవేరెవేరె। యెరిగితెలు సుకొనేటియీయెరుకననిన।నవిమహాకారణముదానికవల నున్న। వాడవీడనితెల్పినవాడు(మొక్కి॥ ౪॥

సీ॥ భూతపంచకమెందుబోడమెనంచనవినియీయాత్మలో నేనాత్మననెటిభ్రాంతి। తనకుదాగలిగెను దానిమహత్తత్వమనిమూలమాయనియనిరిదాని। కుదయించెనొకగు ణక్షోభిణియది గుణత్రయమునుబుట్టించె తామసమున। గలిగెనభంబు తద్గగనమందనిలమాయనిలమందనలమా యనలమందు। జలముజలముననవనియీ సర్వమునవి। రాట్టుజన్మించెవినునావిరాట్టుశివున। కాదితనువయ్యెత క్కిన యంగసమితి। సకలసురలు ప్రకృతిసర్వ సాక్షు లయ్యె ॥౫॥

గీ॥ నీకుశివునకుగల యట్టినిజగుణముల। విడచికను గొను మీశుండువేరెలేడు। ఆశరీరాష్టకమునునీవరయు దరయ। దాశరీరాష్టకంబునిన్నునఘుయనినా ॥౬॥

సీ॥ కర్మత్రయమునకు కర్తలెవ్వరుపాప పుణ్యంబులె వరినిబొందునాత్మ। తనువులోపలనెట్లు తాప్రవేశించును మృత్యువెవరినిబట్టి మిడుకజేయు। ననవిని ప్రజలందరొ నరించుప్రజలకుదీపమంభోజాప్తుడేపగిదిని। శోశించకను తమస్వప్రభచేరాత్రిపగలొక్కరీతిని ప్రజ్వరిలుచు। సాక్షు

లై య్యుండ్దు రారీతిసకలతత్వ। ములపనుల కెల్లసాక్షివై వె
లుగుదీవు। సూర్యుడుదయింప మేదినిసురపశుఘ్ను। లాచ
రించెటిక ర్మఫలములరెంటి ॥౭॥

గీ॥ అక్కడంటనిపగిదినీవంటవనఘ। సుకృతములను
దేహమెరుగదదితిజడంబు। చంటిపిల్లలబాబుచ్చిచనంకినట్లు।
పుణ్యపాపములనుజ్ఞాని పొగరణచునూ ॥౮॥

సీ॥ ఖండముగాకనఖండమైగగనంబు ఘటకారుడొన
రించుఘటములందు। జొచ్చినవిధమాత్మజొచ్చుతత్వము
లందు। జలపూర్ణఘటములోజలజహితుడు। బింబించ్చి
కలశంబు భిన్నమైపోయిన నర్కుండు జావనట్లాత్మజావ।
దంగ్గంబుపంచత్వమందిన ప్రళయముల్ రెండుపిండమున
బ్రంహ్మాండమందు। ప్రళయములు రెండుగలిగుండుప్రళ
యమొకటి। గురునిచేగల్గునివి మిథ్యలెరుగుమితర। బో
ధలెవ్వియుదీనితో బోలవిలను। మేలుసమకూర్చు నీకిది
చాలుచాలు ॥౯॥

క॥ అనిబోధించినదేశికు। గనినుతులొసరించి పూజ
గావించిముదం। బునబొందెతిరిగియీబోధను। వినకను
నృతతిజొరదు తల్లికడుపున ॥౧౦॥

గీ॥ భాగవతకృష్ణుడీ బోధభావమందు। నంమ్మితక్కి
నబోధలజింమివై చె। అమలకమలమరందంబు నాను తే
టి। బొవనేర్చునెదుత్తూరపుష్పములకు ॥ ౧౧॥

ఇతిశ్రీమద్భాగవతకృష్ణవిరచిత గురుశిష్యసంవాదైకాదశకం
సమాప్తం.

౧౨. కందార్థచతుష్కం ॥౮॥

శ్రీమద్భాగవతాంన్వయ। తామరసాక్షునకుకృష్ణ ధాత్రీమరునకుణ్ణ।మామకగురునకుభక్తిని। నేమ్రొక్కి ర చింతువినుడీ॥ నేర్పామీరగనూ*వాజనులార। నిగమాం తార్థమునూ*యేమానియనరాక యేకావాబ్రంహ్మోమం। ద్రీమాయజగమంత్తమేప్పాటాయను లేందే * నేర్పా మీరగనూ-వ్రాజనులార। నిగమాంత్తార్థమునూ ॥౧॥

ఈవిశ్వములోనెుకసతి। తావింన్నప మాచరించెత నదేశికుతో।వోవిప్రవర్య నేనన। నేవిధపుదో తెలియజెప్పు॥ *మిద్దికూడదనకా। శాంత్యానెనామదిఇదివినకా*పావన చరితనాపలి కేనిట్లనిగురు। డీవేబ్రంహ్మావు మేనులేగానం చనుకుంట్టె *ఇదికూడదనకా - శాంత్యానెనా మదిఇది వినకా ॥౨॥

అనినవినిఆపెయిట్లనె। తనువులుయెంన్నొట్లుగలిగెతను వులనెల్లం। కనినట్టిదెవ్వరిదియే। ఘనునకుజంన్మించ్చె ననిన॥ కరుణాతోడుతనూ*చూచిపలికె పరిపూర్ణామున నూ*మనసూబుట్టెనుదాని మహిమేయీాసకలాము। మన సూబ్రంహ్మామునందు। మడశీనమాఓది। కనినమీా దటనూ * చూచిపలికె। పరిపూర్ణాముననూ ॥3॥

దానబుట్టినదిగనుకనె। దీనికియీామహిమగలిగె దేవు డనంగ్గా। మానసమెజీవుడనినను। మానసమేవిశ్వమని న॥ మరిమేనులనినా*మానసమేస। ద్గురుశిష్యులనినా*మా నాసమిప్పుడీ మర్మాముగురునీచె। తానెరుగునోనాడె।

తానెలేకుండూను । మరిమేనులనినా*మావనమేస-ద్గురు శిష్యులనినా ॥౮॥

ఇతి శ్రీమద్భాగవత శ్రీకృష్ణవిరచిత గురు శిష్య సంవ్వాదంబను
కంద్దార్థ చతుష్కం
౧౨॥ సంపూర్ణణం.

శ్రీమద్భాగవత శ్రీకృష్ణదేశికప్రభు
మహారాజసహిత శ్రీమత్ ఫీల్ఖానా శ్రీశంకరదేశికప్రభు
మహారాజుకీజై.

శ్రీమద్వేదాంతసారనీయ, సచ్చిదానంద రహిత, ప్రకృతి ద్వయాతీత, కేవలాత్మ, అశరీర, అచల, స్వరూపులైన, శ్రీమత్ఫీల్ఖానాశంకరప్రభు, నిజగురుస్వాములవారి ప్రియశిష్యులైన, మాధవరాజు వెంకటప్పారావు, మాదిరాజు సూర్యారావు, యీ యిరువురచే అచ్చుకూర్పించి ప్రకటింపఁబడినభక్తజన ముక్తావళియను సద్గురుసంకీర్తనలుగల గ్రంధము సర్వంబును

సంపూర్ణము.

